# విశ్వప్రకాశం

## ఆధ్యాత్మికమాసపత్రిక

శ్రీయువనామ సం॥ శరన్నవరాత్రి విశేష సంచిక సెప్టెంబర్, 1995.

సంపుటి : 1 సంచిక : 11 వెల రూ 5.00



*ఈ సంచికలో .....*



**ముఖచిత్రం:** చదువుల తల్లి సరస్వతి

సంపాదకీయం

# శరన్నవరాత్రులు

-- అక్కిరాజు రమాపతిరావు

అన్ని ఋతువులలోనూ శరత్కాలం మనోహరమైంది. వెన్నెలలను ఇష్టపడని వారెవరుంటారు? ప్రబంధాలలో విరహ బాధననుభవించే నాయికానాయకులు వెన్నెలను కంటగించుకొని చంద్రుణ్ణి దూషిస్తారేమోకాని చంద్రుడందరికీ చల్లని వాడే. అందుకే ఆయన పసిపిల్లవాడి దగ్గరనుంచి పండుముసలివరకూ మామే. చందమామ. చందమామరావే జాబిల్లిరావే అని పసిపిల్లలను రాత్రి చల్లనివేళల ఉల్లాసంగొలుపుతూ తల్లులులాలిస్తారు ఆయన అందరికీ మామ ఎలా అయినాడో! తల్లి తోబుట్టువు కనుక మామ అయినాడు. పాలసంద్రం త్రచ్చినప్పుడు "మాతర్నమామి కమలే కమలాయతాక్షి" పుట్టిందికదూ! ఆవెనుక చందమామ పుట్టాడు అందుకే అందరికీ మామ అయినాడు చంద్రుడు.

శరత్కాలం పండు వెన్నెల కాలం. నల్లమబ్బులు ఆకాశంలో చంద్రుణ్ణి కప్పివెయ్యవు. మబ్బులు కూడా దూది పింజల్లా తెల్లగా తేలిపోతాయి. అందుకే శ్రీనాథుడు శారదాభ్ర శకల చయము అని అంచపిండును వర్ణించాడు. శరత్కాలం అనేక విధాల అందమైనది. వర్షాలు వెనకబడుతాయి. ఎండలు మెండుగా కాయవు. మంచు ఉండదు. చలి గజగజలాడించదు. శీత వాతాతపాలు ఉండక పోవడంతో ప్రకృతి అంతా ఆహ్లాదకరంగా ఉంటుంది. ఎక్కడ చూసినా పచ్చదనం వెల్లి విరుస్తుంది. సర్వప్రకృతి చిగిర్చినట్లు మనోహరంగా భాసిస్తుంది.

రాత్రుళ్ళు కూడా ప్రయాణాలు సాగించవచ్చు కాబట్టి పూర్వకాలంలో రాజులు దండ యాత్రలకు బయలు దేరే కాలంగా నిర్ణయించుకున్నారు శరత్కాలాన్ని. ఆకాశంలో అగస్త్య నక్షత్రోదయంతో నదులన్నీ కలక దేరి అచ్చ స్వచ్ఛంగా కలకలలాడతాయి. వాగులు వంకలు చెరువులు దొరువులు నిండి ఉంటాయి. ఏటి గట్టుల రెల్లు పూలు తళతళలాడతాయి.

ఆశ్వయుజ మాసం అమ్మవారికి చాలా ప్రీతికరమైనది. ఆశ్వయుజంతోనే శరన్నవరాత్రులు ప్రారంభమవుతాయి. నన్నయ భట్టారకులవారు శరత్కాలాన్ని పరమ మనోహరం వర్ణించాడు.

శారదరాత్రులుజ్జ్వల లసత్తరతారకహారపంక్తులన్
చారుతరంబులయ్యె వికస న్నవకైరవగంధ బంధురో

దార సమీర సౌరభా సుధాంశు వికీర్యమాణ క
ర్పూర పరాగ పాండురుచిరాగము లంబరపూరితంబులై

శరద్రాత్రులెట్లా ఉన్నాయట! అచ్చ స్వచ్ఛ వినిర్మల వినీల ఆకాశంలో నక్షత్రాలు మెరుస్తున్నాయట. సరోవరాలలో వికసించిన కలువల పరీమళ లహరులు పండు వెన్నెలలతో మిళితమై ప్రసరిస్తున్నాయట. కర్పూరపు ధూళి ఎల్లెడలా పరచుకుంటున్నట్లున్నాయట వెన్నెలలు. ఇంకో పద్యంలో అరణ్యాలను వర్ణించారు నన్నయ్యగారు శరత్కాలానికి భయపడి కారుమబ్బులు నడగొండల్లాంటి యేనుగుల రూపంలో అరణ్యాలలో విహరిస్తున్నాయట. వర్షాకాలం నాటి మేఘ గర్జన లేశరత్కాలపు అరణ్యాలలో విహరించే మత్తగజాలఘీంకారాలు అని ఉపమించాడాయన. ఆకాశంలో అగస్త్యనక్షత్రోదయం కావడంతో సలిలపంకమైన నదులన్నీ ఇండుప గింజ వేసిన నీళ్ళలా కలకదేరి స్వచ్ఛనీరములై ప్రవహిస్తున్నాయి అని వర్ణించారు నన్నయ్యగారు. అష్టాదశవర్ణనలలో ఋతువర్ణనం కూడా ఒకటి కాబట్టి మనప్రాచీన కవులందరూ ప్రబంధకవులందరూ శరదృతువును అభిరామంగా వర్ణించారు.

సర్వ ప్రకృతి ఆకుపచ్చని పట్టు శాటిధరించినట్లు, శోభించినట్లు తెలుగు కవులంతా తరచువర్ణనచేశారు. సమస్త జీవరాశికీ పైరుపచ్చల ద్వారా జగద్ధాత్రి ఆహార సంపాదనం నిర్వహిస్తుంది శరత్కాలంలోనే. అందువల్ల ఆ ఆదిశక్తిని శాకంభరి అంటారు. శంకర భగవత్పాదులవారు కనకధారాస్తవంలో జగద్ధాత్రిని లక్ష్మీ సరస్వతీ పార్వతీ రూపంలో స్తుతించారు. ఆమె ముగురమ్మల మూల పుటమ్మ.

"గీర్దేవతేతి గరుడధ్వజ సుందరీతి
శాకంభరీతి శశిశేఖర వల్లభేతి
సృష్టిస్థితి ప్రళయకేళిషు సంస్థితాయాః
తస్యైనమః స్త్రిభువనైక గురోస్తరుణ్యై"

సమస్త సృష్టికి ప్రాణాధారమైన ఆహారాన్ని సమకూరుస్తుంది కాబట్టి ఆమె శాకంభరి. శరత్కాలంలో ఆమె సరస్వతిగా పూజలందుకొంటుంది. 'సర్వశుక్లా సరస్వతీ'! ఈ విషయాన్నే పోతన మహాకవి పరమసుందరంగా వర్ణించారు.

శారద నీరదేందు ఘనసార పటీర మరాళ మల్లికా
హార తుషార ఫేన రజతాచల కాశ ఫణీశ కుందమం

దార సుధాపయోధి సితతామర సామర వాహినీ శుభా
కారత నొప్పునిన్ను మదిగానగ నెన్నడు గల్గుభారతీ.

ఆమె తనుకాంతి విభవం శరత్కాల మేఘాన్ని పోలినదట. అంటే తెల్లనితెలుపు. అంతేకాదు శరత్కాల పూర్ణ చంద్రప్రభావిభాసి అయిన తెలుపు ఆమె శరీరకాంతి. ఘనసారం అంటే పచ్చకర్పూరం. శ్రేష్ఠమైనకర్పూరం తెలుపు. పటీరమంటే పటిక. మరాళమంటే హంస. ఆమె హంస వాహనకూడా కదా! మొల్లలు కూర్చినహారం వంటిది ఆమె దేహయష్టిసౌందర్యం. మంచు, సముద్రపు నురగ, వెండికొండ, రెల్లు, ఆదిశేషుడు, మల్లెపువ్వు, కల్పప్రసూనం, పాలసంద్రం, తెల్లతామరపువ్వు, అభ్రగంగ, ఇవ్వన్నీ తెలుపుకు ప్రసిద్ధాలు. ఇటువంటి ధవళరోచిస్సులతో ఉపమింపదగిన తను సౌందర్యం కలిగిన ఓ తల్లీ నాకు ప్రత్యక్షంకావమ్మా! అని ప్రార్థించాడు పోతన మహాకవి, భాగవత రచనా ప్రారంభంలో ఆ తర్వాత పద్యంలో ఆ పలుకుల తల్లిని ఆయన "అంబనవాంబుజోజ్జ్వల కరాంబుజ శారదచంద్ర చంద్రికా డంబర చారుమూర్తి" అనీ స్తుతించాడు. దశమ స్కంధంలో ఆమహాను భావుడు విశదమైన శరదృతువును పండు వెన్నెల వంటి వచనంలో వర్ణించాడు. అంతకు ముందు ఒక అందమైన కందపద్యం. "వనములు జొంపములతో ప్రకాశించాయి. లోకంలో రొంపులన్నీ ఇగిరిపోయినాయట. నెమలిగుంపుల రొదలు అణిగిపోయాయట. నదులు నిండుగా పరువులు తీశాయట. ఉరుముల, శంపల సంపదలు మానె శారదవేళన్."

ఆశరత్కాలంలో ఆకసం ఎట్లా ఉన్నదంటే "విజ్ఞానదీప విలసితం బగుయోగి హృదయంబు చంధంబున శుభ్రంబైన యభ్రంబు" అని వర్ణించారు పోతన మహాకవి. ఇక నక్షత్రాలు ఎలా ప్రకాశిస్తున్నాయంటే "అభ్రంబున నీలదుకూల వితాన సంయుక్త ముక్తా ఫలంబులవడువున నెగడు నుడు గణంబులును" అన్నారు. అంటే నీలిరంగు పట్టురవ సెల్లాలు కప్పిన అందమైన చాందినీలో వ్రేళ్ళాడదీసిన ముత్యాల మాలికల్లా ఉన్నాయి నక్షత్రాలు.

శరత్కాలాన్ని అభివర్ణించే ఈ వచనం ఎంత అందంగా ఉంటుందో చదివి ఆస్వాదించాల్సిందే. అంతే కాదు ముక్త పదగ్రస్తంగా, యమకగమకంగా మరింత అలంకారభరితం చేశారు ఈ వచన సౌందర్యాన్ని. ఆశారదరాత్రుల ప్రకృతి సౌందర్యం ఎంతగా మనోహరంగా వర్ణించారంటే "కలహంస కోక సారస కోలాహల మండితంబులై నిండి నిర్మల జలంబులుగల జలాశయంబులును, జలాశయంబుల జలము లనుదినమునిగుర

గృహములంౘ్రబతుకు దినములు సనుటయెరుంగని మనుజులగమనికందిరుగు జలచరములును, జలచరహృదయముల బెగడుగదుర దొంకియింకిన నదులును, నదులందు గర్పూర మండపంబుల తెరంగున, మణికుట్టిమంబుల మాడ్కిని, సౌధ సోపాన మార్గంబుల జాడను విలోకితంబులగు నూతన సైకతంబులును, సైకత ప్రదేశంబుల నుదయవేళ నిత్యకర్మానుష్ఠాన నిరతులగుమునులును, మునికన్యకా కరకలశ సలిలాభిషిక్త మూలంబులగు తపోవన బాలరసాల సాలంబులును" అని శరత్కాలంలో తపోవ్రతుల దినచర్యలను, సూర్యరశ్మికి గాలికి కూడ చొరనలవి కాని అరణ్య సాంద్రవాటికలను వర్ణించారు.

శరత్కాల వర్ణనంలో గొప్పచమత్కారాలు సాధించారామహాకవి. "రాజరాజగృహంబు పగిది విలసిత కుంద పద్మ సౌభాగ్యంబై, భాగ్యహీను కర్ణంబు రేఖ నశ్రుత నీలకంఠ శబ్దంబై, శబ్దశాస్త్రవేది హృదయంబు బాగున విశద ప్రకాశాభిరామంబై, రామసంగ్రామంబు కైవడి బాణాసనాలంకృతంబై, కృతాంత హృదయంబుకరణి నపంకంబై, పంకజాసనుగేహంబు సొంపున -రాజహంస విరాజ మానంబై, మానధనుని చరిత్రంబు సొబగున నకల్మష జీవనంబై, వననిధి పొలుపున సమ్మిళిత భూభృద్వాహినీ సంకులంబై, కులవధూరత్నంబు చెలువున నదృష్టపయోధరంబై, ధరణికిం దొడవగుచు శరత్కాలం బువచ్చె" ఈ వచనంలో చక్కని శ్లేషలు ఇమిడి ఉన్నాయి. మొగ్గవిడివడుతున్నప్పుడు సౌరభంప్రసరించినట్లుగా ఈశ్లేషలలోని అర్థాలు మనసుని ఆనందతుందిలంచేస్తాయి. 'మహారాజుగృహం సర్వఋతువులలో ఆయాపుష్పసంశోభితంగా ఉంటుంది. భాగ్యహీనుడి చెవిలో పరమశివుడి పేరు వినపడదు, వ్యాకరణంబాగాచదువుకున్న వాడి హృదయం వికాసాన్ని పొందుతుంది, శ్రీరాముడియుద్ధంలో శరశరాసనాలు ప్రకాశించినట్లే ఆకసంలో బాణాసనాలు ప్రకాశిస్తాయి. కొండలనిండా సెలయేళ్ళు ఉరుకులు తీస్తాయి. ఆకసంలో పయోధరాలు కన్పించవు, కులవధూరత్నం పాటించే మర్యాదలాగా' అని వర్ణిస్తూ పుడమికి గొప్పఅలంకారం ఈశరత్కాలం అని వర్ణించారు పోతన మహాకవి.

వాజుల నీరాజనములు రాజులజయగమనములును రాజితలక్ష్మీ
పూజలు దేవోత్సవములు రాజిల్లెను జగతి యందు రాజకులేంద్రా!
చేగగల చెరకు వింటను, బాగుగ నీలోత్పలంబు బాణంబుగ సం
యోగంబుచేసి మదనుడు, వేగిరమున విరహిజనుల వేటాడెనొగిన్.

-- అన్నారు పోతన మహాకవి.
ఇదీ శరత్కాల సౌందర్యం.

# అనుభవతరంగిణి

-- శ్రీ జి.వి.యల్.యన్. విద్యాసాగరశర్మ

సుప్రసిద్ధ పారిశ్రామిక వేత్త, తాడికొండ (గుంటూరు జిల్లా) విద్యాసంస్థల అధ్యక్షుడు విద్వాన్ శ్రీ గోగినేని కనకయ్యకు మాస్టరుగారంటే ఎనలేనిభక్తి విశ్వాసాలు. మాస్టరుగారి ద్వారా తాను పొందిన అనుభూతిని పలువురికి అందించి, వాళ్ళను గూడా ఆనందింప జెయ్యాలన్న కాంక్షతో ఆయన తమ సంస్థల్లో పనిచేస్తున్నవాళ్ళనూ, పరిచయస్థుల్ని, స్నేహితుల్నీ వెంటబెట్టుకొని పోయి మాస్టరుగారి పరిచయ భాగ్యం కలిగించారు. ఏలూరిపాటి అనంతరామయ్య, జి.రామారాయుడు, అన్నాకృష్ణమూర్తి, నాగళ్ళ హనుమాయమ్మ (పెదవడ్లపూడి), రామ్మోహనరావు (చినవడ్లపూడి) మొదలైన వాళ్ళంతా మాస్టరుగారి కిట్లా పరిచయమైన వాళ్ళే.

1986 లో డిప్యూటీ ఎడ్యుకేషనల్ ఆఫీసరు శ్రీమతి వెంకట్రామమ్మ గరల్స్ హైస్కూలు తనిఖీకోసం తాడి కొండ వెళ్ళింది. ఆమె సత్య సాయిబాబా భక్తురాలు. కనకయ్యగారుకూడా సత్యసాయిబాబా భక్తుడే! మాటలసందర్భంలో కనకయ్యగారు ఆమెతో తాను రెండు మూడు రోజుల్లో పుట్టపర్తి పోతున్నానని చెబితే, ఆమె "చాలాకాలం నుంచి బాబాగారిని చూడాలనుకొంటున్నాను. నేనూ మీతో వస్తా"నంది. అట్లా ఆమెకనకయ్యగారితో పుట్టపర్తి వెళ్ళివచ్చి, తనయింట్లో బాబాగారి పూజ ఏర్పాటుచేసింది. ఆపూజకు కనకయ్య అక్కడికి వెళ్ళాడు. అప్పుడు వాళ్ళ ఇంట్లో మాస్టరుగారు పూజ చేస్తున్నారు. శ్రీమతి వెంకట్రామమ్మకు మాస్టరుగారు బాగా తెలుసు. మాస్టరుగారంటే ఆమె ఎంతో అభిమానంతో ఉండేది. కనకయ్యగారికి అప్పట్లో మాస్టరుగారు తెలీదు. ఆయన మాస్టరుగారిని చూచి, "ఈయనెవరు?" అని అడిగారు. ఆమెను. "విశ్వంమాస్టారంటారు. బాబాగారి భక్తులు: శక్తిమంతులు. మిమ్మల్ని బాగా ఎరుగుదురు" అని ఆమెచెప్పింది. పూజానంతరం అందరితో బాటు కనకయ్యగారు కూడా మాస్టరుగారికి నమస్కారం చేసుకొని ఆశీస్సులు తీసుకొన్నాడు. అట్లా జరిగింది ఆయనకు మాస్టరుగారితో పరిచయం.

ఆతర్వాత రైలుపేటలో మాస్టరుగారు అద్దెకు తీసుకొని ఉంటున్న రూంకు (విశ్వమందిరానికి) రెండు మూడు సార్లు ఆయన వెళ్ళారు. అక్కడ

వాకిలిదాకావెళ్ళి, గదిచిన్నదిగా ఉండటం, ఆగదిలో ఆడవాళ్ళు చాలామంది ఉండటం చూచి, లోపలికి వెళ్ళడానికి కాస్త సంకోచించి వెనక్కు తిరిగి వస్తుండేవాడు. నాలుగో సారి వెళ్ళినప్పుడు మాస్టరుగారు ఆయన్ను చూచి "లో పలికి రండి" అని ఆహ్వానించారు. ఆయన లోపలికి వెళ్ళాడు. అప్పటి నుంచి ఆయన ప్రతిరోజు విశ్వమందిరానికిపోయి, పూజలో పాల్గొంటూ, మాస్టరుగారి ఆశీస్సులు పొందివస్తుండేవారు.

ఆయన నిర్వహిస్తున్న "గ్రీన్‌లీఫ్‌టుథ్రెస్సర్స్" (ప్రయివేటు-లిమిటెడ్) కంపెనీ ప్రారంభదశలో - మిషనరీ ఫిట్టింగ్ చేసేటప్పుడు కొంతకాలం సమస్యలతో సతమతమౌతూ పనులు సాగక కుంటు పడింది. ఆయన మాస్టరుగారి దగ్గరకు పోయి, తన సమస్యలు చెప్పుకొంటే మాస్టరు గారు వాళ్ళ కంపెనీకి వెళ్ళి, కొబ్బరికాయలుకొట్టి పూజ చేసివచ్చారు. అప్పటినుంచి ఆసంస్థ సమస్యలన్నీ పరిష్కారమై, నిర్విఘ్నంగా పనులన్నీ చకచకా జరగటం మొదలు పెట్టాయి. అట్లాగే గుంటూరుకు దగ్గర్లో ఉన్న పేరేచర్లలో ఆయన నెలకొల్పిన "శ్రీసత్యసాయి ఎంటర్ ప్రైజస్" కొన్ని కారణాలవల్ల పనులు జరగక స్తంభిస్తే మాస్టరుగారు అక్కడికి వెళ్ళి పూజచేసి, ఆశీస్సులిచ్చి వచ్చారు. ఆ ఆశీస్సుల ఫలితంగా ఈనాడు ఆసంస్థ విజయవంతంగా నడుస్తున్నది.

ఒకసారి కనకయ్యగారు భగవాన్ శ్రీసత్యసాయికళాశాల ఆఫీసు భవన శంకు స్థాపనకు మాస్టరుగారిని తాడికొండ తీసుకొనివెళ్ళారు. ఆరోజు ఎడతెరిపి లేకుండా కుండపోతగా ఒకటేవర్షం. భూమికొలతలు తీసుకొని ముగ్గుపొయ్యడానికి వీలుపడలేదు. "ఏం చెయ్యాలా?" అని కనకయ్యగారు ఆలోచిస్తుంటే మాస్టరుగారు ధ్యానంలోకి పోయి, కాసేపటికి కళ్ళుతెరచి, అంతవానలో తడుస్తూ పోయి, సుముహూర్త వేళకు ఒకచోట కొబ్బరికాయ కొట్టివచ్చారు. "భవననిర్మాణం త్వరలోపూర్తి అవుతుం"దని ఆశీస్సులిచ్చారు. విచిత్రంగా మాస్టరుగారు కొబ్బరికాయ కొట్టినచోట, ఆతర్వాత కొలతలు వేసిచూస్తే, భవనానికి ఈశాన్యహద్దుగా, శంకుస్థాపనకు అనువైన ప్రదేశంగా కొలతలకు సరిపోయింది. కనకయ్యగారి దగ్గర ఆ సమయంలో భవన నిర్మాణానికి కావలసిన నిధిలేకపోయినా, మాస్టరుగారి ఆశీర్వాదబలంతో ద్రవ్యం సమకూరి భవననిర్మాణం అతి త్వరగా పూర్తి అయింది. నా [illegible] న విశ్వవిద్యాలయం వైస్‌ఛాన్సలర్ శ్రీరామకోటయ్యగారి అధ్యక్షతన మాస్ట[illegible] ఆ భవనానికి ప్రారంభోత్సవం చేశారు. ఆనాటి సభలో విశ్వమందిర ఆస్థానకవి "కరుణశ్రీ" గారు శుభాశీస్సులు పలికారు.

కనకయ్యగారంటే మాస్టరుగారు ప్రత్యేకాభిమానం చూపిస్తుండేవారు. తాము ఏ ఊరు వెళ్ళుతున్నా ఆయన్ను వెంట బెట్టుకొని పోతుండేవారు. అట్లా ఆయనకు మాస్టరుగారితో కలసి పత్తిపాడు, పెదనందిపాడు, పెదవడ్లపూడి, భట్టిప్రోలు మొదలైన చాలా గ్రామాలకూ, గుంటూర్లో అనేక భక్తుల యిండ్లకు పోయే అదృష్టంకలిగింది. విశ్వమందిరంలో నిర్వహించే ప్రతికార్య క్రమంలో విధిగా ఆయన పాల్గొంటూ మాస్టరుగారి హృదయంలో ఒకప్రత్యేక స్థానాన్ని పొందగలిగారు.

"దేహో దేవాలయో ప్రోక్తో జీవో దేవ స్సనాతనః" అనే ఉపనిషద్వాణి ననుసరించి, "దేహమే దేవాలయం, హృదయమే దైవమందిరం" అన్ననినాదంతో వ్యక్తి సంస్కరణనూ, తద్వారా కుటుంబసంస్కరణనూ చేపట్టి, మానవులనందరినీ శక్తి సంపన్నులుగా తీర్చిదిద్దడానికి కంకణంకట్టుకొన్న శ్రీవిశ్వయోగి విశ్వంజీ ఎందరినో తమ ఉపదేశాలతో ప్రభావితం చెయ్యడం, దత్తశక్తితో అనేక మంది ఆర్తులకూ, అర్థార్థులకూ శుభాశీస్సులందించి వాళ్ళను పుష్టిగా, సంతుష్టిగా, ఆనందంగా, ప్రశాంతంగా ఉండేటట్లు చెయ్యడం, నిత్యం కళ్ళారా చూస్తూ, ఆనందిస్తూ, మాస్టరుగారి సన్నిధి పెన్నిధిలాభావిస్తూ ఆయన మురిసిపోతుంటారు. తమఅదృష్టానికి పరవశిస్తుంటారు.

"ఎవరిని మనం ఆరాధించినా అదిభగవంతునికే చెందుతుంది. ఈనాడు పరిపూర్ణావతారంగా, మన అదృష్టంకొద్దీ పుట్టపర్తిలో భగవాన్ శ్రీసత్యసాయి బాబా వెలిశారు. వారిని దర్శించి, పునీతులు కండి!" అని తమదగ్గరకు వచ్చే భక్తుల్ని ఆదేశిస్తున్న మాస్టరుగారి మార్గం ఏగురువుకూ, ఏ దేవుడికీ, ఏ అవతార పురుషుడికీ వ్యతిరేకమైందికాదు. సర్వమూతానై, తానే అన్నిరూపాలై వెలుగొందుతున్న శుద్ధచైతన్య స్వరూపం మాస్టరుగా"రని కనకయ్యగారు భక్తిభావంతో పలుకుతుంటారు. ఆయనకు మాస్టరుగారిపట్ల గల భక్తి శ్రద్ధలు ఈనాడు పలువురికి మార్గదర్శకాలౌతున్నవి.

మాస్టరుగారి మరో ముఖ్య భక్తుడు గడియారం రామారావు. శ్రీమాధవపెద్ది రాధాకృష్ణమూర్తిగారి దగ్గర జూనియర్ అడ్వకేటుగా కొంత కాలం పనిచేసి ఇప్పుడుస్వంతగా ప్రాక్టీసు పెట్టాడు. కొత్త పట్టాభి పురం (రవీంద్రనగర్) లోని హరిహర క్షేత్రంలో దత్తాత్రేయ ఆలయానికి శంఖుస్థాపన మహోత్సవానికి మాస్టరుగారు వచ్చినప్పుడు 18-12-1988 వ తేదీనాడు రాధాకృష్ణ మూర్తి గారితో కలసి పోయివారి దర్శనం చేశాడు. ప్రథమ వీక్షణంలోనే మాస్టరుగారి పట్ల ప్రత్యేకాకర్షణగలిగి సకుటుంబంగా విశ్వమందిరానికి రోజూ పోతూ మాస్టరుగారి ఆశీస్సులను ప్రత్యేకాభిమానాన్ని

చూరగొని ఈ నాడు మాస్టరుగారెక్కడికి పోయినా వారి కారుడ్రైవ్‌చేస్తూ, మాస్టరుగారికి అంగరక్షకుడైయ్యే అదృష్టంపొందాడు. ఏదైనా కోర్టు పనులవల్ల విశ్వమందిరానికి వెళ్ళకపోతే ఆరోజు ఆయనకు ఎంతో భారంగా అనిపించేది. ఆయన మనస్సులో సదా మాస్టరుగారే మెదలుతూ ఉంటారు. "ఓంశ్రీసాయిరాం గురుదేవదత్త" అని మనస్సులో అనుకోగానే మాస్టరుగారి రూపం ఆయనకు తళుక్కుమంటుంది. ఇంతగా ఆయన మాస్టరుగారితో మానసిక సంబంధం పెట్టుకొన్నాడు. మాస్టరుగారితో పరిచయమైనప్పటినుంచి ఆయన దినచర్యలో, ఆలోచనాసరళిలో ఎంతో మార్పువచ్చింది. దైవచింతన సమయం పెరిగింది. విశ్వగురు కటాక్షం పుష్కలంగా లభించింది. కనుకనే ఆయన మాస్టరుగారి ఆశీస్సులతో కరుణశ్రీ గారితో కలిసి పుట్టపర్తి వెళ్ళగలిగాడు. అక్కడ బాబాగారు ఆయన నమస్కారం చెయ్యగానే మాస్టరుగారిలా వీపున తట్టటం చూచి నివ్వెరపోయాడు. లేచిచూస్తే ఎదురుగా మాస్టరుగారు చిరునవ్వుచిందిస్తూ దర్శన మిచ్చారు. మరుక్షణంలో ఆ వెలుగు రేఖలు కరిగిపోయి బాబాగారు కనిపించారు ఆయనకు.

1990 ఆగస్టు 9 వ తేది ఆయన భార్య శ్రీమతి సాయి ఇందిర బాత్‌రూములో కాలు జారిపడింది. కాలికి దెబ్బతగిలింది. ఆ నొప్పి తగటానికి మాస్టరుగారిని అడిగి విభూతి తెచ్చిపెట్టమని ఆమె ఆయన్ను కోరింది. ఆయన విశ్వమందిరం వచ్చాడు. అప్పుడు విశ్వమందిరంలో విద్యాసాగర శర్మగారు 'శ్రీవాసుదేవానంద సరస్వతీ స్వామి సద్గురు చరిత్ర' సప్తాహ పారాయణం చేస్తున్నారు. ఆరోజున శ్రీశర్మగారు మాస్టరుగారికి ఒక పరీక్ష పెట్టారు. మాస్టరుగారే శ్రీవాసు దేవానంద సరస్వతీ స్వరూపులు (దత్త స్వరూపులు) అయితే ఈ ఘట్టం నేను విశ్వమందిరంలో పారాయణం చేస్తున్నప్పుడు మాస్టరుగారు వచ్చినా ప్రక్కన కూచోవాలి. లేకపోతే మాస్టరుగారు దత్తస్వరూపులని నమ్మను అని భావించి పారాయణం చేస్తున్నారు. (ఈ విషయం" విశ్వగురు చరిత్రలో విపులంగా వర్ణించబడింది. విశేషాలకు పాఠకులు 'విశ్వగురుచరిత్ర' లో 'విశ్వదర్శనం' అధ్యాయం చూడవలసినదిగామనవి). శర్మగారు మొదటి అంతస్థులో మాస్టరుగారి దగ్గరకు పోయి, తన భార్య కాలిదెబ్బ విషయం చెప్పి విభూతి ప్రసాదించమని కోరితే మాస్టరుగారు ఆయనకు ఇన్ని విభూతి పొట్లాలిచ్చి పద! వెళ్ళిఅమ్మాయిని చూచివద్దాం" అని ఆయనతో బయలు దేరివెళ్ళారు. ఇందిర కాలుకు విభూతిరాచి, ఆమెకు ధైర్యం చెప్పి, అందరికీ ఆశీస్సులిచ్చినారు. ఆ విభూతి రాయంగానే ఇందిర కాలునొప్పి, తగ్గిపోయింది. ఆనొప్పిని మాస్టరుగారు స్వీకరించారు. ఏకాలుకైతే ఇందిరకు దెబ్బ తగిలిందో ఆ కాలిపైన మాస్టరుగారికి ఒక గడ్డ అప్పటికప్పుడు

లేచింది. అంతా ఆ విచిత్రం చూచి అవాక్కులయ్యారు. రెండు మూడు రోజుల్లో ఇందిర కాలునొప్పి పూర్తిగా తగ్గిపోయింది. మాస్టరుగారు తమ దగ్గరకు వచ్చే భక్తులకు ప్రసాదిస్తున్న దివ్యానుభూతులు రోజూ ప్రత్యక్షంగా కళ్ళారాచూస్తున్న రామారావు ఆనాటి రాముడికి హనుమంతునిలా మాస్టరుగారికి "నమ్మిన బంటు" అయ్యాడు. మాస్టరుగారి దయతో వీళ్ళ పెద్దమ్మాయి పూర్ణిమకు వివాహం అయింది. రెండో అమ్మాయి గాయత్రికి మెడిసిన్‌లో సీటు వచ్చింది. ఆ కుటుంబం యావత్తు మాస్టరుగారి విశేషానుగ్రహంతో సుఖ సంతోషాలతో ఈనాడు తులతూగుతున్నది.

(సశేషం)

# శ్లోకమాలా

-- శ్రీ కనమలూరు వెంకటశివయ్య

శ్రీవైకుంఠపుర ప్రఖ్యామ్
పరమేష్ఠి సభాసమమ్
కైలాసగిరి తుల్యంచ
భూలోకే విశ్వమందిరమ్

సద్గురుం కరుణాసింధుమ్
విశ్వమందిర సంస్థితమ్
ఆత్మజ్ఞానాయ [illegible]దేహమ్
విశ్వంజీ [illegible]

యస్మిన్ పశ్యామి ధాతారమ్
కేశవంచ పినాకినమ్
దత్తాత్రేయంచ వందేహమ్
విశ్వంజీవిశ్వయోగినమ్

మమ తాతశ్చ మాతాచ
జన్మదత్తామ్ దదాతియో
జన్మసాఫల్య సౌభాగ్యమ్
వందేహం విశ్వయోగినమ్

ఆగచ్ఛతజనాః! క్షిప్రమ్
వందధ్వం విశ్వయోగినమ్
పాపానివః పలాయేరన్
శ్లిష్యేద్వోముక్తి కామినీ

# నవరాత్రములు - వైదికదర్శనము

— హరిశ్రీరామమూర్తి

మన పండుగలలో దసరా పండుగలు ముఖ్యమైనవి. మిక్కిలి ప్రశస్తమైనవి. ఇవి శరత్కాలంలో వస్తాయి. వర్షాకాలంలో నీటి కాలుష్యము, మరియు క్రిమి, కీటకాదులచేత భయంకర వ్యాధులతో ప్రజలు బాధలు పడుదురు. శరత్కాలంలో బురదపోయి నీరు స్వచ్ఛముగ, సత్పురుషుని మనస్సు వలె కడురమణీయముగనుండును. ప్రసన్నముగ నుండును. "అకర్దమమిదం తీర్థం భరద్వాజ నిశామయ, రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్యమనోయథా" - రామాయణమ్

శరత్ అంటే 'శృణాతి పంకం' అను వ్యుత్పత్తి ప్రకారం నీటిలో బురద పోగొట్టి వానిని స్వచ్ఛము చేసినట్లు, మనోమాలిన్యమును పోగొట్టి మానవులను పరిశుద్ధుల గావించును. 'శీర్యంతే శరత్' అను వ్యుత్పత్తి రీత్యా నశించి రాలిపోవుకాలము అని అర్థము. కారణం వ్యాధులే. అందుకని ఉపవాసములు, కఠోరనియమాలు, వ్రతములు, దీక్షలు ఏర్పాటుచేసి వ్యాధులనరికట్టు మార్గములను మహర్షులు మానవుల నుద్ధరించిరి. జప, తపో, హోమ, యజ్ఞాదుల నేర్పాటు చేసిరి. శరత్కాలంలో శ్రీ శారదా దేవి యారాధనయే కల్యాణప్రదము.

"ప్రథమో దైవ్యోభిషక్" అని, "వాచా సరస్వతీ భిషక్" అని వేదము. మొట్టమొదటి, ప్రధానవైద్యుడు పరమేశ్వరుడనీ, వేద మాత - వేదమాతృ స్వరూపిణియగు సరస్వతి - వీరిరువురు వైద్యులనీ వేదమే చెప్పికొనినది. లలితాదేవి 'మహావ్యాధి ప్రశమనీ, సర్వమృత్యు నివారిణీ, కలికల్మష నాశినీ' అని పిలవబడుచున్నది. ఈలలితా దేవి ఎట్టి భయంకరమైన వ్యాధులనైనా, మృత్యువును సైతము నివారించి కలి కాలములోని కల్మషాన్ని భస్మము చేయును. అయితే నామెనుకఠిన దీక్షతోను, కఠోరనియమములు, శ్రద్ధాభక్తులతో కొలవాలి. ఈ దీక్షలలో నవరాత్రి [illegible] ప్రధానాతి ప్రధానము. ప్రతి సంవత్సరము, ప్రతి మాసము, ప్రతిరోజు, [illegible]త్రి, పగలు అనుష్ఠించాలి. వీలుపడనిచో కనీసం తొమ్మిది రాత్రులు అయినా అనుష్టించి తీరాలి.

"శరత్కాలే మహాపూజాం క్రియతె యాచవార్షికీ". రాత్రి శబ్దమునకు రాత్రి అని అర్థం తీసికొని 'రాత్రి' పూట [illegible]తమే పూజలు చేస్తున్నారు. కొందరు నవాహోరాత్ర దీక్ష యని రాత్రి, ప[illegible] చేస్తున్నారు. "అష్టరాత్రౌ

నదోషోఽయం, నవరాత్రి తిథిక్షయే" అని చెప్పబడుటచే రాత్రి అంటే తిథి అని అర్థం. "తిథి శ్శరీరం దేవస్య" అనబడుటచే తిథి శబ్దానికి దేవుని శరీరమని అర్థము. రాత్రి శబ్దానికి దివస మనే అర్థం గలదు. అందుచే తొమ్మిది దినములు అని నవరాత్ర శబ్దార్థము. 'త్రికాలం పూజయేత్' అని స్మృతి వాక్యప్రకారం రాత్రి శబ్దానికి కాలమని అర్థం కావున తొమ్మిది రోజులు మూడు కాలములలోను చేయవలెను. అనగా పొద్దున, మధ్యాహ్నం, సాయంకాలము పూజ చేయాలి.

"ప్రతిపన్ముఖ్య రాకాంత తిథి మండల పూజితా" అని లలితా సహస్రనామములు. ప్రతి పత్ (పాడ్యమి) మొదలు పూర్ణిమ వరకు తిథిమండలంలో పూజించబడు దేవత లలితయే. "ప్రతిపచ్ఛారదీం జ్ఞాత్వా సోఽశ్నుతే సుఖమవ్యయమ్" అనగా ప్రతిపత్తు (పాడ్యమి) నాడు శారద నర్చించిన శాశ్వత సుఖమొందును. ప్రతి పత్తు అనే శారద లేక ప్రతి పత్తే శారద అని కూడ అర్థము. "బుద్ధిర్మనీషాధిషణా" ప్రతిపద్జ్ఞప్తి చేతనా అని అమరకోశము. ప్రతి పత్తు అంటే బుద్ధి, జ్ఞాపకశక్తి. ఒకచైతన్యశక్తి అని అర్థము. కాని ప్రతి పత్తే శారద అంటే మానవుని బుద్ధియే శారద. అనగా మానవుని బుద్ధి. సక్రమంగా ఉంటే సుఖశాంతులు ఆతనిని వరించును. కష్ట, నష్టములు, వ్యాధులు నశించును.

రాత్రి శబ్దమునకు దేవి, పరమేశ్వరి యను అర్థముగలదు.

"ఆశ్వినేమాసిమేఘాన్తే ప్రతిపద్యాతిథిర్భవేత్
తస్యాంనక్తం ప్రకుర్వీత రాత్రిదేవీంచ పూజయేత్"

వర్షా కాలంచివర, ఆశ్వయుజ మాసంలో, ప్రతిపత్తిథి నాడు రాత్రి దేవిని పూజించాలి అని అర్థము. రాత్రి దేవి యనగా రాత్రిరూపిణి యగుదేవిని, రాత్రియనెడి దేవిని, రాత్రే దేవి (రాత్రియేదేవి) ని పూజించాలి యని అర్థము.

"రాత్రిరూపా యతోదేవీ దివారూపోమహేశ్వరన్|
రాత్రివ్రతమిదందేవి సర్వపాపప్రణాశనమ్"

పరమేశ్వరి రాత్రి రూపిణి, పరమేశ్వరుడు దివా (పగలు) రూపుడు. వీరిపూజయే రాత్రివ్రతమని అర్థము.

"అంబికా కైతవే సిద్ధౌ నిద్రాయాంనిశికీర్త్యతే"

అని విశ్వకోశము. 'అంబిక' అనగా పరమేశ్వరి, మోసము, సిద్ధి,

నిద్ర, రాత్రి అని అర్థములను విశ్వకోశము పేర్కొన్నది. రాత్రికి నిశా, నిశీథినీ, రాత్రిన్, విభావరీ, తమస్వినీ అని పేర్లను అమరకోశము చూపుచున్నది. విభావరి అనగా రాత్రి. లక్ష్మీ అష్టోత్తరములలో "వాచం పద్మాలయాంపద్మాం నిత్యపుష్టాం విభావరీమ్" అని గలదు, లక్ష్మీదేవి విభావరి. పద్మ - వేదవాక్కు, స్వాహాదేవియని అర్థము. రాత్రి రూపిణి యగులక్ష్మి 'నిత్యపుష్ట' అని పిలవబడుచున్నది. నిత్యము సుఖము నిచ్చి పోషించునది అని అర్థము. "రాతి సుఖమతి రాత్రిః". సుఖమిచ్చునది రాత్రి యని అర్థము. రాత్రి శబ్దానికి భౌతికంగా రాత్రి అని అర్థమున్నను, సుఖమునిచ్చునది అని అర్థమును గ్రహించక ఆరాత్రి లక్ష్మీదేవిగను, వేదవాణి, సరస్వతి గను, అంబిక లలిత గను గోచరించును, ఆమెయే లక్ష్మియే "నవదుర్గ" యనీ "మహాకాళి" యని బ్రహ్మ, విష్ణు, శివ స్వరూపిణి యనబడుచున్నది. "నవదుర్గాం మహాకాళీం బ్రహ్మవిష్ణు శివాత్మికామ్."

కాళియే భద్రకాళి, మహాకాళి, కాలరాత్రియని చెప్పబడుచున్నది. కాలరాత్రి యనగా మామూలుగ భయంకరమైన రాత్రియని లోకప్రసిద్ధి. కాని కల శబ్దమునుండి నేల శబ్దముపుట్టినది. 'కలఏవ కాలః.' కలః అంటే మంజులధ్వని. ఆమంజులధ్వని ఓంకారము. దాని నుండి పుట్టినది వేదము. రాత్రి సుఖమిచ్చునదిగదా!. కాన కాలరాత్రి అనగా వేదము నారాధించిన సుఖ ప్రాప్తి గల్గునని తెలియును. కాలరాత్రియనునది ఒకశక్తి. "కాలరాత్ర్యాది శక్త్యౌఘవృత్రా" అని లలితకు పేరు. రామాయణంలో హనుమంతుడు రావణాసురునికి జ్ఞానబోధ చేస్తూ సీతాదేవి కాలరాత్రి స్వరూపిణియని, విద్యాదేవతయగు వేదమాత యని చెప్పును.

"కాలరాత్రీతి తాంవిద్ధి సర్వలంకా వినాశినీమ్
తదలం కాలపాశేన సీతా విగ్రహరూపిణా"

వేదస్వరూపిణియైన సీత నవమానించిన కాలరాత్రియై నిన్ను నాశనము చేయును. "సమ్యగారాధితా విద్యా ప్రబోధ వినయావివ" అనగా ఆరాధింపబడిన సీత వేదస్వరూపిణి, జ్ఞానము, వినయమునిచ్చి రక్షించును. అని అర్థము. ఆమేయే గాయత్రి. "గాయంతం త్రాయత ఇతి. తనను ఆరాధించు వారిని సదా రక్షించును. నవ శబ్దమునకు తొమ్మిది అనే సంఖ్య, క్రొత్తది, స్తోత్రము చేయబడుట అని అర్థము. వీనిని బట్టి నవరాత్రదీక్షయనగా తొమ్మిది రాత్రులు, తొమ్మిది తిథులు, తొమ్మిది దినములతో స్తోత్రము చేసిన యాపరదేవత నిత్యనూతన సుఖమిచ్చును.

రాత్రులు మధుకృతులు, పగళ్లు మధు వృష్టులు అని వేదము చెప్పుచున్నది. సత్కర్మలు చేయువార్కి రాత్రులు మధువును తయారు చేయును. పగళ్లు ఆమధువును వర్షించును అని చెప్పుచున్నది. దుష్కర్మలు చేయువార్కి మధువును వర్షింపవు. సత్కర్మలు చేయువాని జీవితము మధురమేయగును. అట్లు మధువును చేయు రాత్రిని తేనెటీగ (సరఘ) (సరఘా మధు మక్షికా) యని స్మృతులు ఆర్తించుచున్నవి. స్కాందపురాణము:-

"పరః పరతరం బ్రహ్మ ప్రకర్షేణనవమ్ అపరః ప్రణవం సాక్షాత్ శబ్దరూపః సునిర్మలః". బ్రహ్మ పరమని అపర మని రెండువిధములు. పరబ్రహ్మ స్వాభావికముగా, స్వతః సిద్ధముగ 'నవ' స్వరూపుడు. ఆపరబ్రహ్మ శబ్దరూపమగు వేదము. అది ప్రకృష్టమైన నవము ప్రణవము కావున బ్రహ్మ 'నవ' శబ్దముచే చెప్పబడుచున్నాడు. వేదము ప్రకృష్టమై 'నవ' (ప్రణవ) శబ్దముచేత చెప్పబడుచున్నది. కాన నవరాత్రులు అనగా బ్రహ్మరాత్రులు, వేద రాత్రులు అగును. అనగా వేదము, తత్ప్రతి పాద్యమైన బ్రహ్మనారాధించిన మానవులు సుఖశాంతులు బొందెదరు. "మంత్రాక్షరమయీం లక్ష్మీం మాతౄణాంరూపధారిణీమ్, నవదుర్గాం మహాకాళీం కన్యాం పూజయామ్యహమ్"

వేదమంత్ర స్వరూపిణి మహాలక్ష్మియే ముగ్గురమ్మల రూపమును ధరించి నవదుర్గ, మహాకాళి, మహాలక్ష్మి, మహాసరస్వతి యగుచున్నది. నవరాత్రులలో తొమ్మిది రోజులు తొమ్మిది మంది కన్యలను (తొమ్మిది మంది దుర్గలనుగా భావించి) పూజించవలెను. వారిని "కుమారి, త్రిమూర్తి, కల్యాణి, రోహిణి, కాళీ, చండిక, శాంభవి, దుర్గ, సుభద్ర" అని అందురు. సర్వకార్యసిద్ధికి బ్రాహ్మణకన్యను, జయప్రాప్తికి రాజకన్యను, వ్యాపారలాభ ప్రాప్తికి వైశ్యకన్యను, పుత్ర ప్రాప్తికి శూద్ర కన్యను పూజించవలెను అని పురాణవచనము. పురాణ మనగా 'పురానవమ్' అని వ్యుత్పత్తి. ప్రాచీనమైనను క్రొత్తది అని యర్థము.

"బ్రాహ్మణీ సర్వకార్యార్థేషు జయార్థే నృపవంశజామ్
లాభార్థేవైశ్యకన్యాంచ సుతార్థే శూద్రవంశజామ్"

**విజయదశమి:**

1. లలితా దేవి 'దశమీ తిథిరూపా' అని 'విజయా విమలా వంద్యా' అని నామములతో విరాజిల్లుచున్నది. దశమీ తిథిరూపిణియైన లలిత 'విజయ' అని పిలవబడుచున్నది.

2. "దశమ్యాంతు నరైస్సమ్యక్ పరాజితా|
క్షేమార్థం విజయార్థంచ - దదాతి విజయం దేవి

విజయా జయవర్ధనీ" - దశమి తిథినాడు పూజింపబడు విజయా దేవి విజయము చేకూర్చును.

3. "ఉదయే దశమీ కించిత్ సంపూర్ణైకాదశీయది|
శ్రవణార్థం యథాకాలేసాతిథిర్విజయాభిధా" - రత్నకోశము.

సూర్యోదయమునకుకొద్దిగ మాత్రమే దశమి తిథియుండి మిగిలిన రోజంతా ఏకాదశియుండి శ్రవణా నక్షత్రముతో గూడిన దశమి తిథికి 'విజయ' అని పేరు.

4. "ఈషత్సంధ్యా మతి క్రాంతః కించి దుద్భిన్నతారకః||
విజయోనామకాలోఽయం సర్వకార్యార్థ సిద్ధిదః" చింతామణి కోశము.

సంధ్యాకాలము కొంచెము దాటిన పిదప, నక్షత్రములు కొంచెముగ ప్రకాశించు కాలమునకు "విజయ" అనిపేరు. ఆ కాలము సర్వ కార్యములను సిద్ధింపజేయును.

5. "ఏకాదశో ముహూర్తో యోవిజయః పరికీర్తితః"
రోజులో పదకొండవ ముహూర్తమునకు 'విజయ' అని పేరు

6. శివతీర్థములలో 'విజయ' అనుతీర్థము కాశ్మీరమునగలదు.

7. విశ్వకర్మ శాస్త్రప్రసిద్ధమైన 'విజయ' అనే గృహమున దేవి యుండును.

8. పద్ముడను రాక్షసుని జయించి దేవి 'విజయ' 'అపరాజిత' అని కీర్తింపబడుచున్నది.

9. 'విజయో జయః' అని విష్ణువునకు పేరు.

10. అర్జునుడు విజయుడు. విజయ దశమినాడు విజయా దేవినర్చించి విజయుడాయెను.

11. తాను 'విజయ' అగుచూ (పిలవబడుచూ) మానవులకరిషడ్వర్గ జయమును, ఇంద్రియముల జయమును కల్గించుచున్నది.

12. 'విజయా అనంతా వాణీ విద్యా' అని కల్పద్రుకోశము.
'విజయ' యనగ యనంతమైన దివ్యవాణి వేదవాణియే.

"వర్షీయాన్ దశమీ జ్యాయాన్" అని అమరకోశము. పెక్కు సంవత్సరములు గల్గిన వానిని, మిక్కిలి వృద్ధుని దశమీ అని అంటారు. వృద్ధుడు అనగా (వర్ధతే ఇతివృద్ధః) బాగా వృద్ధి నొందినవాడు. వృద్ధిని ఇచ్చువాడు. అట్లు ప్రాచీనుడై, వృద్ధినివ్వగలవాడు పరమేశ్వరుడు. "వృద్ధః" అనీ, "అహమస్మి ప్రథమజా ఋతాఽస్య - పూర్వం దేవేభ్యః" అందరికంటె ముందు పుట్టినదానవు అని వేదము తన్నుతాను చెప్పికొనుటచే వృద్ధా, అని దశమీ అని పిలవబడుచున్నది.

విజయదశమీ . అనగా విజయ రూపిణి యగు వేదమాత. విజయమునిచ్చి మానవుల వృద్ధి నొందించు మాత.

## నవరాత్రులు - విజయదశమీ:

1. "అష్టాచక్రా నవద్వారా దేవానాం పూరయోధ్య |
తస్యాగ్ం హిరణ్మయః కోశః పరంజ్యోతిషావృతః" వేదము.

ఎనిమిది చక్రములు, తొమ్మిది ద్వారములు గల్గిన మనదేహమే అయోధ్య అని అనబడు దేవతా పురము. నవద్వారాధి దేవతలే నవవిధ దేవతలు. ఈ దేవతల పట్టణములో బంగారు కోశము, జ్యోతిస్సుతో నింపియున్నది. ఆ జ్యోతిస్సే జీవుడు. దేవుడు. దేహోదేవాలయే శేతే దశాత్మా త్రితనుర్విభుః|" అని స్మృతులు నవద్వారవతి - 'ద్వారక' అనే మానవ దేహంలో దేవుడు దశాత్మకుడై ఉన్నాడు. ఆ దశాత్మకత్వమే దశావతార స్వరూపము. ఈతడే 'దశమీ' అని తెలియనగును. ఈ దశమిని ఆరాధించిన నవద్వారములు శుద్ధియగును.

2. "పతిర్జాయాం ప్రవిశతిగర్భోభూత్వా సమాతరమ్|
తస్యాం పునర్నవోభూత్వా దశమేమాసి జాయతే|"

భర్త గర్భరూపములో భార్యను ప్రవేశించి, అందు తొమ్మిది నెలలుండి, నవమాసముల తరువాత దశమ మాసములో పునర్నవుడై, నిత్య నూతనుడై జన్మించుచున్నాడు. విజయుడగుచున్నాడు.

కుమారుడు జన్మించిన పదకొండవ రోజున నామకరణం చేస్తారు. అపుడు తండ్రి కుమారుని కుడి చెవిలో మూడు సార్లు వాక్ వాక్వాక్ అని చెప్పి "నీపేరు వేదము" అని వ్రాసి, పిదప వ్యవహారనామమును వ్రాస్తాడు.

"అధాస్య దక్షిణం కర్ణమభినిధాయ వాగ్వాహితి త్రిరథ అధాస్య నామ కరోతి - వేదోఽసి పుత్రనామాసి - ఆత్మావై పుత్ర నామాఽసి" - అని వేదము.

వేదము విజయ రూపిణి గద! కాన 'వేదము' అని పేరు పెట్టబడిన నా నవ శిశువు విజయుడు అగును. భోజమహారాజు తన స్తోత్రంలో ఇలాచెప్పెను.

"అనాదినిధనం నిత్యం నవం యచ్చక్షణే క్షణే|
విజయం వృద్ధి మద్దివ్యం తద్వాఙ్మధు దినోతునః"

ఆద్యంతరహితమై, నిత్యమై, క్షణక్షణమునవమై (నూతనమై) జనుల వృద్ధినొందించుచు, విజయ రూపిణి, దివ్యమునగు నా 'వేద వాణి' యనే మధువు మనలను కాపాడుగాక!

"కాత్యాయనాయ విద్మహే| - కన్యకుమారి ధీమహి|
తన్నో దుర్గిః ప్రచోదయాత్" - దుర్గాగాయత్రి మంత్రము.

మాహేశ్వరి, కాళి, ఉమ యగు కాత్యాయనిని తెల్సుకుందాము. కన్యాకుమారియైన పరాశక్తి నారాధించుదాము. అప్పుడు మన బుద్ధిని దుర్గాదేవి మంచి ప్రేరణ నిచ్చి కాపాడును అని అర్థము. నవరాత్రులలో మొదట నారాధింపబడు కన్య కుమారి. చివరి కన్య దుర్గ. మధ్యలో నున్న వారంతా దుర్గా స్వరూపులే. వీరందరి ఆరాధన మనకు పాపనాశనము. రక్షాకరము. అట్లే మనభారత దేశమును ఒకచివర కన్యాకుమారి, హిమాలయములలోని దుర్గ, మధ్యలో నితర దుర్గలు మధుర మీనాక్షి, కంచిలోని కామాక్షి, విజయవాడ కనకదుర్గ, భద్రకాళి, రాజరాజేశ్వరి, కాశీ విశాలాక్షి, అన్నపూర్ణాదేవి వీరందరు నిరంతరము ఆరాధింపబడుచున్నవారై రక్షించుచున్నారు. సర్వారిష్టముల నుండి కాపాడ కల్గిన వారు ఈ నవ దుర్గలే - నవరాత్రులే.

## శరత్కాల శ్యామసుందరుడు

-- బమ్మెర పోతన (*శ్రీ మహాభాగవతం*)

వ. "ఇట్లు భాసురంబులైన శరద్వాసరంబుల గోవిందుండు
గోపబృంద సమేతుండై, బృందావనంబునం బసుల బొసంగ మేపుచు

సీ. కర్ణావతంసిత కర్ణికార ప్రభ గండ భాగద్యుతి గడలుకొలుప
భువనమోహనమైన భ్రూవిలాసంబుతో వామభాగానత వదనమొప్ప
నపసవ్యకర మృదులాంగుళీచాతురి షడ్జధ్వనికి మర్మసరణిజూప
డాకాలిమీద నడ్డము సాచినిల్పిన పదనఖద్యుతి భూమిఁబ్రబ్బికొనగ

మౌళిపింఛము కంఠదామమును మెఱయ
విలసితగ్రామముగ నొక్క వేణువందు
బ్రహ్మగాంధర్వ గీతంబు పరగజేసె
జతుర నటమూర్తి గోపాల చక్రవర్తి

# శమీ శమయతే పాపమ్

-- హెచ్. వాసుదేవశర్మ

విజయము గోరువారు విజయదశమి నాడు విజయాదేవిని, శమీవృక్షపూజచేయాలి. శమీ వృక్షమును తెలుగులో జమ్మిచెట్టు అని అంటారు. కాని సంస్కృత శబ్దమగు యీ 'శమీ' పదానికి 'శమయతీతి శమీ' అని వ్యుత్పత్తి. 'శము ఉపశమే' అనే ధాతువునుండి పుట్టి సకల దోషములను పోగొట్టునది, శమము నిచ్చునది, శమముగల్గినది యని యర్థముల దెల్పుచున్నది. "శమీ సక్తు ఫలాశివా" "శమీసక్తు ఫలాజయా" అని కోశములద్వారా 'శమీ' మంగళకరమైన జయము నిచ్చు వృక్షము అని తెలియనగును. -

"నమో వృక్షేభ్యః హరికేశేభ్యః" అని వేదము, వృక్షములన్నీ పరమేశ్వర స్వరూపములని చెప్పుచున్నది. అందులోను రావి, జమ్మి, మోదుగ, బిల్వము మొదలగునవి వృక్షములే గాక మహౌషధులు గూడ. ఈవృక్ష ఛాయ, స్పర్శ, పూజ, వాతావరణము, ఆకులు, పుల్లలు అన్నీ పవిత్రములు. వీని హోమముతో సకలవిధ వ్యాధులు నశించును. పాపములు నశించును. విషవాయువులు గూడ విరిగిపోవును.

వానిలో శమీ వృక్షము ప్రధాన దివ్యౌషధము.

"శమీయుక్తం జగన్నాథం భక్తానా మభయంకరం|

అర్చయిత్వా శమీవృక్ష మర్చయేచ్చ పునః పునః||" - భవిష్యపురాణము. ముందు శమీపూజ చేసి, శమీ యుక్తుడైన పరమేశ్వరారాధన చేయాలి అని అర్థము.

"అమంగళానాం శమనం శమనీం దుష్కృతస్యచ|"

దుఃస్వప్న నాశనీం ధన్యాం ప్రపద్యేఽహం శమీంశుభామ్" - గోపథ బ్రాహ్మణమ్"

అమంగళములను, దుష్కృతములను పోగొట్టి, (శమింప జేసి) దుఃస్వప్నముల నాశనము చేసెడు, శుభముల గల్గించెడి శమీ దేవతను శరణు వేడుదును.

"శమీ శమయతే పాపం శమీ శత్రువినాశినీ,

అర్జునస్య ధనుర్ధారీ రామస్య ప్రియ దర్శినీ" - భనిష్య పురాణము.

అర్జునుని బాణముల ధరించి, రామునికి ప్రియమును దర్శింపజేసిన యీ శమీ శత్రువులను - అంతశ్శత్రువులను, బాహ్యశత్రువులను - నాశనము చేయగలదు.

"గృహీత్వా సాక్షతా మార్ద్రాః శమీమూల గతాం మృదమ్|
గీత వాదిత్రనిర్ఘోషైః ఆనయేత్ స్వగృహంప్రతి||
తతో ధారయేత్ స్వజనైస్సహ|"

పూజతర్వాత అక్షతలతో గూడిన 'శమీ' వృక్షం మొదట్లోని తడి మట్టిని భజనాది గీతములు, మేళతాళాలతోను తెచ్చి తను, ఇంటిలోని వారితో సహా ధరించవలెను.

"సర్వత్ర విజయో మేఽస్తు త్వత్ప్ర సాదాత్ సురేశ్వరి"

అంతట నాకు విజయము చేకూర్చుము అని దేవతలకు గూడ ఈశ్వరియైన శమీవృక్షము నారాధించు చున్నాము.

ఈ శమీపూజను తత్త్వార్థ మెరిగి చేసినచో నుత్తమ ఫలితముల నిచ్చును.

"శమః అస్య అస్తీతి శమీ" అనే సమాసము ద్వారా శమము గల్గినది శమీ అగునని అర్థము. శమమనగా శాన్తి. "శమః అంతఃకరణో పరమః, అంతః కరణజయః" అని శంకరాచార్యుల వారి నిర్వచనము. శమమనగా అంతఃకరణం అనగా మనస్సు యొక్క నిర్వ్యాపారస్థితి - నిశ్చలత. ఇతర విషయములనుండి నిరోధింపబడుట - అంతరింద్రియముల జయము అనగా అంతః శత్రువులను జయించుట అని అర్థము. అంతః శత్రువులు కామ, క్రోధాదులు. కామమును, క్రోధమును జయించిన చిత్తవృత్తి నిరోధము గల్గును. ఈ చిత్తవృత్తి నిరోధమే యోగము. "యోగశ్చిత్తవృత్తి నిరోధః" అని యోగసూత్రము. కావున యోగము శమము ద్వారా సాధ్యము. కాన శమము గల్గిన శమీ, యోగి యగును, ఈ శమమును మొదట బోధించినది వేదము.

"ఓం శాన్తిః శాన్తిః శాన్తిః" "శమశ్చస్వాధ్యాయ ప్రవచనేచ"

"దమస్తపః శమస్తపః దానంతపః యజ్ఞంతపః" అని వేదము బోధించుచున్నది. శమమును (శాన్తిని) స్వాధ్యాయ ప్రవచనములు సాధించండి. దమము, శమము, దానము, యజ్ఞము అన్ని తపస్సులే. ఇవే లోక కల్యాణ కారకములని చెప్పుచున్నది. కాన ఇట్టి శమమును బోధించుచు శమము గలిన శమీ వేదమాతయే.

"తనకోపమె తనశత్రువు తనశాంతమే తనకు రక్ష దయ చుట్టము" అని సుమతి శతకము. "శాంతము లేక సౌఖ్యము లేదు" అని త్యాగరాజు బోధ.

శమీ వృక్షము లోపల అగ్ని ఉంటుందని కాళిదాస మహాకవి గర్భవతియైన శకుంతలను అగ్నిగర్భయైన శమీవృక్షముతో పోల్చుతాడు.

"దుష్యన్తేనాహితం తేజః దధానాంభూతయే భువః|

అవేహి తనయాఃబ్రహ్మన్ అగ్నిగర్భాం శమీమివ" - అభిజ్ఞాన శాకుంతలమ్.

ఇంకను "శమప్రధానేషు తపోధనేషు గూఢంహి
దాహాత్మకమస్తి తేజః" - అభిజ్ఞానశాకుంతలమ్

శమమే ముఖ్యముగ, శమమనే తపస్సుగల మహర్షులలో దహించు శక్తి గల నొక తేజస్సు గూఢముగ నుండును. శమీవృక్షములో దాహాత్మక మగు అగ్నియున్నట్లు ఈ 'శమీ' తపోధనులు అనబడు యోగులలో కూడ అగ్ని యుంటుంది. శమరూపతపస్సే తపోధనులైన ఋషులకు ధనము.

ఇట్లు శమము (శాన్తి) గల యోగికి అంతఃకరణములు, అనగా ఇంద్రియములు, మనస్సు వశములైయుండును. ఆ యోగి జితేంద్రియుడు జయీ విజయీ అగును. విజయుడైన; శాంతచిత్తుడైన యోగికి భగవంతుడు దగ్గరగా యుండునని భగవద్గీత ఇట్లు చెప్పుచున్నది.

"జితాత్మనః ప్రశాంతస్య పరబ్రహ్మ సమాహితః"

పరమేశ్వరుడు శాంతమూర్తి, తేజోమూర్తి అని భర్తృహరి గూడ చెప్పెను. శమము, తేజస్సుగల శమీ వృక్షమువలె పరమేశ్వరుడును 'శమీ' అగును.

"స్వాను భూత్యేక మానాయ నమశ్శాన్తాయ తేజసే"

"శాంతం పద్మాసనస్థం", "ప్రలయ హుతవహం స్వాంకుశం వామభాగే" అనునీశివస్తోత్రము పరమేశ్వరుని అగ్నిగర్భునిగను, శాంతమూర్తిగను తెలియచేయుచున్నది.

"శాంతమిద మాశ్రమపదం" అని కాళిదాసు వచనము. శాంత మూర్తులగు ఋషుల ఆశ్రమములు గూడ ప్రశాంతముగ నుండును. అట పులి, మేక స్నేహవాతావరణములో నుండునట్లు శమీవృక్షవాతావరణము గూడ నట్లేయుండును.

"తానార్తాన్నష్ట సంజ్ఞాంశ్చ ఆహుతా సూన్ బృహస్పతిః

విద్యాభిర్మంత్రయుక్తాభి రోషధీభి రజీవయత్" - రామాయణ యుద్ధములో మరణించిన వారిని, స్పృహకోల్పోయిన వారిని, ఆర్తులను మంత్రములతో గూడిన వేదవిద్యలతో (వాక్కులు) అనెడి ఓషధులతో బ్రతికించెను అని అర్థము. కావున ఓషధులు శమీ, బిల్వ, అశ్వత్థ, నింబ (వేప) మొదలగునవి వేద మంత్ర స్వరూపములుగ చూడవలెను కాని భౌతికంగా 'చెట్ల' రూపముగ చూడరాదని వాల్మీకి మహాముని ప్రబోధము.

"అన్యధాభూషణం పుంసాం శమో లజ్జేవ యోషితామ్"

అట్లే "శుచిభూషయతి శ్రుతం వపుః ప్రశమస్తస్య భవత్యలంక్రియా" అని కిరాతార్జునీయము. స్త్రీలకు సిగ్గువలె పురుషులకు శమమే అలంకారమని అర్థము. ఈ శమము నల్గురి వద్దనే లభించును. పరమేశ్వరుడు, వేదములు, యోగులు, ఆలక్షణములు గల్గియున్న శమీవృక్షము.

# దివ్యయోగి చరితామృతం - యోగానంద నరసింహ మహర్షి

**(1886-1960)**

-- ఆచార్య బి.రామరాజు

మానవులు కర్మజీవులనీ కారణజన్ములనీ రెండురకాలు. యోగులు, అవధూతలు, ఋషులు, సిద్ధులు, భక్తులు కారణజన్ములు; మిగతావారు కర్మజన్ములు. కర్మజన్ముల జనన మరణాలు సుఖదుఃఖాలు కర్మవశంలో ఉంటవి. కారణజన్ముల జననమరణాలు, జీవితాలు వారి చేతిలో ఉంటవి. అట్టికారణ జన్ముల్లో యోగానంద నరసింహమహర్షి ఒకరు.

ఒంగోలు జిల్లా మార్కాపురానికి రమారమి రెండామడల దూరాన తోకపల్లి అనే గ్రామం ఉన్నది. అక్కడ కొండెబోయిన గురుమూర్తి లక్ష్మమ్మ అనే ముతరాసి దంపతులుండేవారు. వారి పూర్వపుణ్యాం వలన 1886 లో వారికి ఒక అబ్బాయి పుట్టినాడు. సుబ్బారాయుడని పేరు పెట్టి అల్లారుముద్దుగా సాకుతున్నారు. సుబ్బారాయుడు పౌగండవయస్సులో తన గ్రామం వీధిబడిలో చదివింది వాన కాలపు చదువే కాని తోడి పసుల కాపరులతో తిరుగుతూ ప్రకృతి పాఠశాలలో నేర్చుకున్నదే ఎక్కువ. ప్రకృతిబడిలో సుబ్బారాయుడు పంతులు; తోడి ఆటకాండ్రు, పసులకాపరులు విద్యార్థులు. తన చుట్టూ మూగిన ఆ పిల్లలకు సుబ్బారాయుడు దేవతల కథలు చెప్పుతూ, భక్తిగీతాలు పాడుతూ వారిచేత పాడించేవాడు. ఊరిలోని పెద్దల చెంత, వచ్చిపోయే పౌరాణికులవద్ద భక్తి శ్రద్ధలతో మెలగుతూ భగవద్భాగవతుల కథలు వినేవాడు; తనలో తాను ఆనందించేవాడు. సుబ్బారాయునికి బాల్యంనుండి నాట్యమన్నా నాటకాలన్నా ప్రీతి మెండు. తాను భజన కీర్తనలు పాడుతూ నృత్యం చేసేవాడు. యక్షగానాలు, వీధినాటకాలు ఇష్టపడి చూచేవాడు.

సుబ్బారాయుడు కొంచెం పెరిగి పెద్దవాడు కాగానే ఇల్లు విడిచి విశాల ప్రపంచంలోనికి వెళ్ళిపోయినాడు. ఒక గ్రామంలో వీధినాటకం

ఆడుతుంటే చూచి ఆ నటకులవెంట గ్రామాలు తిరుగుతూ ఆటపాటలు నేర్చుకున్నాడు; వారిలో ఒకడుగా చేరిపోయినాడు. తాను వేషంకట్టి రంగస్థలంపై నటించినాడు. తన పాత్ర బాగా పోషించినాడు. అంత చిన్నవయస్సులో అంత బాగా నటించిన సుబ్బారాయణ్ణి చూచి ఒక శ్రీవైష్ణవ పండితుడు ముచ్చటపడి తనయింటిలో పెట్టుకున్నాడు, కొడుకునువలె సాకినాడు. ఆచార్యులవారు సుబ్బారాయుడుకు పురాణముల సారం పుక్కిట పట్టించినాడు, వేదాంతం తలకెక్కించినాడు, మంత్రాలుపదేశించినాడు. సుబ్బారాయుడా మంత్రాలను నిష్ఠతో రేయింబవలు జపించినాడు. ఉన్నట్లుండి సుబ్బారాయుడు ఆచార్యుల సెలవు తీసుకొని అడవి బాట పట్టినాడు. అతడు మంత్ర జపంచేస్తూ గహనాటవుల్లో తిరుగుతుంటే క్రూరమృగాలు అల్లంత దూరం నుండి తమదారిన తాము పోయేవి. భక్తప్రహ్లాద నాటకంలో ప్రహ్లాద పాత్రనటించిన సుబ్బారాయనికి ఆ పాత్రతో తాదాత్మ్యం లభించినట్లుగా, తాను ప్రహ్లాదుడుగా నరసింహ స్వామి ఉపాస్య దైవంగా భావించి అడవుల్లో తిరుగుతుండేవాడు. ఇట్లా అడవుల్లో తిరుగుతూ అడవుల సర్వేక్షణ చేసే ఒక పాశ్చాత్యునికంట పడ్డాడు. ఆ సర్వేయరు సుబ్బారాయని భక్తిని ముఖవర్చస్సును గమనించి తనయింటికి తోడుక పోయినాడు; తన శాఖలో ఒక చిన్న ఉద్యోగిగా నియమించినాడు. తీరికవేళల్లో ఆ తెల్లదొర సుబ్బారాయని భక్తిగేయాలు వింటూ నృత్యం చూస్తూ ఆనందించేవాడు. సుబ్బారాయని నోట వెలువడే వేదాంత వాక్యాలు జ్ఞానపు సుద్దులు విని అబ్బుర పడేవాడు. సుబ్బారాయడు తనకు లభించే జీతపు రూకలు దరిద్రనారాయణులకు అనాథులకూ పంచి పెడుతుంటే అతని నిరీహానిస్పృహలు గమనించిన తెల్లదొర తనబంటుకు భక్తుడైపోయినాడు.

సుబ్బారాయునిలో క్రమంగా త్రికరణశుద్ధి రూపుకట్టింది. "వాచం అర్థో ఽనుధావతి" అన్నట్లు ఆతని నోటివెంట వెలువడే మాటలు యథార్థాలయ్యేవి. తెల్లదొర కాతని మాటలు సుఖదుఃఖాల్లో తాకివచ్చినవి. ఆతడు చెప్పినట్లే భవిష్యత్తు ఫలించింది. సుబ్బారాయుని ఉద్యోగం తిరువళ్ళూరుకుమారింది. తిరువళ్ళూరు వీరరాఘవక్షేత్రం. సుబ్బారాయుడు నిత్యం వీరరాఘవస్వామిని సేవిస్తుండేవాడు, నిద్రాహారాలు మాని నామజపయజ్ఞం చేసేవాడు; ఆ జపంలో తన్ను తాను మరచేవాడు. అది గమనించిన తెల్లదొర సుబ్బారాయుణ్ణి చెన్నపట్నానికి మార్చినాడు. ఉద్యోగధర్మం

నిర్వహిస్తూ భక్తుడుగా జ్ఞానిగా సుబ్బారాయడు ఎదుగవలెనని తల్లిదండ్ర అభిమతం. కాని తానొకటి తలచితే దైవమింకొకటి తలచింది. సుబ్బారాయుడొకనాడు చెన్నపట్నం వీధులు తిరుగుతుండగా ఒక అవధూత దర్శనం ఐనది. ఆయన అత్యాశ్రమి, ద్వంద్వాతీతుడైన శ్రీదిగంబరాచల యోగి. జడలుకట్టిన శిరోజాలతో దిగంబరంగా స్థాణువట్లు కదలకమెదలక ఒకచో కూర్చున్న అవధూతను చూచి కాసేపు అట్లే నిలుచుండి పరుగెత్తిపోయి పాదములంటినాడు. అవధూత ఉలుక లేదు పలుక లేదు. గంటలు గడచినవి, దినములు దొరలినవి. ఈ విధంగా మూడు అహోరాత్రాలు సుబ్బారాయడు దిగంబరాచలయోగి పాదాలు పట్టుకొని ఉన్నాడు. నాల్గవదినం కన్నులు తెరచిన అవధూత బాల భక్తుని నెత్తిపై చేయుంచి దీవించినాడు. సుబ్బారాయుని శరీరంలో విద్యుత్తు ప్రవహించింది. ముఖం సూర్యతేజస్సుతో వెలిగిపోయింది. అంతే. సుబ్బారాయనికి సమస్తమంత్రాలు, యోగమర్మాలు, సిద్ధులు కరతలామలకములైనవి. సుబ్బారాయని నోట "శ్రీనారసింహా! శ్రీహరీ!" అనే మాటలు వెలువడినవి. దిగంబరాచల యోగి తన శక్తులు బాలయోగి సుబ్బారాయునికి ధారవోసి అదృశ్యుడైపోయినాడు. ఆ గురుకటాక్షంపొందిన సుబ్బారాయుడు శ్రీయోగానంద మహర్షి ఐనాడు.

నాల్గుదినాలైనా తిరిగిరాని సుబ్బారాయుడు కోసం తల్లిదండ్ర చెన్నపట్నం వీధులు గాలించి ఒకచోట "శ్రీనారసింహా!" అంటూ కేకలు వేస్తున్నవాణ్ణి పట్టుకున్నాడు. తన ఉద్యోగి పిచ్చివాడైపోయినాడని వగచి సహాయకులతో జన్మగ్రామం తోక పల్లికి పంపించినాడు. అక్కడ తోకపల్లిలో తొలుత సుబ్బారాయునికి పిచ్చెక్కిందనుకున్న వాళ్ళు అటుతరువాత అతడు గొప్ప యోగిగా మారినాడని గుర్తించినారు. ఆయన పేరు చెప్పితే భూతప్రేతాలు పారిపోయేవి. ఆయన నోటివెంట వచ్చిన ప్రతిమాట పరమసత్యమయ్యేది. అందువలన యోగానందుల పేరు పెంపులు తోకపల్లి దాటి పరిసరగ్రామాలకు ప్రాకినవి. యోగానందులు నిరాహారంగా మౌనంతో సమాధిస్థులైనప్పుడు దుర్లభులు; జాగ్రదవస్థలో సులభులు, అప్పుడు ప్రజల మంచిసెబ్బరలు విచారించేవారు. ఉన్నట్లుండి యోగానందులు తోకపల్లివిడిచి నల్లమల దుర్గమారణ్యం చొచ్చి దీర్ఘకాలం తీవ్రతపం చేసి భగవత్ సాక్షాత్కారం పొందినారు. చాలా కాలం తరువాత పొడవైన జడలతో పెద్ద గోళ్ళతో కౌపీనధారులైన యోగానందులు తోకపల్లికి తిరిగివచ్చినారు. అప్పుడాయనను

సామాన్య జనం తోకపల్లిస్వామి అని, విజ్ఞులు యోగానంద నరసింహ మహర్షి అని పిలిచేవారు. భయంకరమైన కలరా, ప్లేగు వంటి రోగాలు ప్రబలిన గ్రామాలవాళ్ళు వచ్చి తోకపల్లి స్వామిని ప్రార్థించి తీసుకపోయే వారు. స్వామి మంత్రజపయజ్ఞాలతో ఆబాధలు అరిష్టాలు తొలగించేవారు. క్రమంగా ఆజనాన్ని తమ యెడభక్తులుగా దిద్ది సన్మార్గగాములను చేసేవారు. ముముక్షువులకు యోగమో, మంత్రమో ఉపదేశించేవారు. ఒకసారి ఒకగ్రామంలో యజ్ఞంచేస్తూ భగభగమండే యజ్ఞకుండంలో కూర్చుండి తాము అగ్నిదేవుడుగా నిరూపించినారు.

యోగానంద నరసింహ మహర్షి కొంతకాలం కపిలగిరిపై తపస్సు చేసినందున శ్రీలక్ష్మీనరసింహస్వామి ప్రత్యక్షమైనాడు. తత్ఫలితంగా యోగానందులు శ్రీలక్ష్మీనరసింహాలయం కట్టించి స్వామిని ప్రతిష్ఠించి నిత్యారాధనలతో పాటు ఏటేట నరసింహజయంత్యుత్సవాలు జరిపేవారు. ఒకసారి మార్కాపురంలో కలరా భయంకరంగా వ్యాపించింది. చాలామంది చనిపోయినారు. యోగానందులు అక్కడికిపోయి ఒక్కనాటితో ఆవ్యాధిని పారద్రోలినారు. అబ్బూరులో శ్రీమంతుడు తక్కెళ్ళపాటి లక్ష్మయ్యభార్య హనుమాయమ్మ అసాధ్యమైన వ్రణంతో బాధపడుతుంటే ఆవూరిభక్తుడు గుణకయ్య ప్రార్థన మన్నించి యోగానందులు అబ్బూరుకు పోయి మూడు దినాలలో నయంచేసినారు. అంతటితో అబ్బూరులో స్వామి మహిమ బాగా వ్యాపించింది. స్వామి మరొకసారి గుణకయ్య అభ్యర్థనపై అబ్బూరుకు పోయి మానుకొండ గంగయ్య అనే శ్రీమంతుణ్ణి రోగవిముక్తుణ్ణి చేసినారు. ఈయిరువురు శ్రీమంతుల సహాయంతో గుణకయ్య గురుదేవులు యోగానంద మహర్షికి అబ్బూరులో ఒకమఠం, ఆమఠం సమీపాన లక్ష్మీనరసింహ స్వామిగుడి కట్టించినాడు. గుణకయ్య కొడుకు నారాయణస్వామి అనే 15 ఏండ్ల బాలుని భవిష్యత్తు మహర్షి గుర్తించి ఆతడు తనంతవాడౌతాడని అష్టాక్షరీమంత్రం ఉపదేశించి యోగాసనాలు నేర్పి, నారాయణదాసనినామకరణం చేసినారు. ఆయనే గురుదత్త బ్రహ్మర్షి నారాయణ స్వామిగా ప్రసిద్ధులైనారు. అబ్బూరులో యోగానంధులొకసారి సుదర్శన మహామంత్రం జపిస్తుంటే పూజాగృహంలో మంటలు లేచినవి. భక్తులంతా భయభ్రాంతులైతే స్వామి మరొక మంత్రం జపించి మంటలు చల్లార్చినారు. ఈ అద్భుతం గమనించిన చుట్టు పట్ల గ్రామాలవారు స్వామి మహిమలు దూరదూరాలకు వ్యాపింపజేసినారు.

మరొకసారి అబ్బూరులోనే యోగయజ్ఞం సంకల్పించి యజ్ఞకుండంలో గంధపు చెక్కలుంచి బండతో కప్పి దానిపై తొమ్మిదిదినాలు సమాధిస్థులై కూర్చుండి ధ్యానతత్పరులైనారు. వారి యోగ బలంతో గంధపుచెక్కలనుండి మంటలు లేచినవి. దీనితో యోగానందులు నరసింహావతారమని ప్రసిద్ధులైనారు. ఈయజ్ఞంతో తమకు చేదోడు వాదోడుగా ఉన్నశిష్యుడు నారాయణ స్వామి యెడ మిక్కిలి ప్రసన్నులై కపిలగిరికి పిలిపించుకొని నృసింహ సుదర్శన మహామంత్రాలుపదేశించినారు. కపిలగిరిపై ఏటేట నృసింహజయంత్యుత్సవాలు నిర్వహించే ాధ్యత శిష్యుడు నారాయణ దాసు స్వీకరించినాడు. గుణకయ్య, నారాయణ దాసు, శాయమ్మ మానుకొండ అచ్చమ్మ, హనుమయ్య, గద్దె నరసింహదాసు, కుచేలయ్య, కోటదాసు, చేపూరి మహాలక్ష్మి, కోట రామయ్య శెట్టి, వెంకటేశ్వరయోగి, కోట కోటయ్య, కోట సుబ్బరాయగుప్త వంటివారెందరో యోగానందులను సేవించిన ధన్యులు. వీరిలో నారాయణదాసు గురుదత్త బ్రహ్మర్షి బిరుదాంచితులు; చుక్కల్లో చంద్రుడు. నారాయణదాసు యోగానందులవద్ద సమస్త వేదాంత యోగవిద్యారహస్యాలు తెలుసుకొని సాధించి గురువంతవాడైనారు. సద్గురువు లెప్పుడూ శిష్యులు తమంతవాళ్ళు, తమకంటె గొప్పవాళ్ళు కావలెనని కోరుతుంటారు. "శిష్యాదిచ్ఛేత్ పరాజయం" అని కదా ఆర్యోక్తి.

యోగానందులు తమ అవతారం చాలించే సమయం రాగానే శిష్యుణ్ణి అబ్బూరునుండి పిలిపించుకున్నారు. ఇతర శిష్యులను రావించు కున్నారు. తమను జీవసమాధి చేయవలసిందిని ఆజ్ఞాపించి నారాయణ దాసుకు భావికార్య క్రమాలు యోగవిజయాలు తెలిపి తనపీఠానికి ఆయనను వారసుడుగా అభిషేకించినారు. శా.శ.1882 శార్వరి పుష్యశుద్ధ త్రయోదశి శుక్రవారం (30-12-1960) పగలు సమాధిస్థితులై బ్రహ్మరంధ్రం భేదించుకొని విశ్వాత్మలో కలిసిపోయినారు. శ్రీ నారాయణదాసు గురువుగారికి విధివిధానోక్తంగా అంత్యక్రియలు చేసినారు. దూరప్రాంతాల శిష్యులు వచ్చి దర్శించటానికై గురువుగారి పార్థివశరీరాన్ని శుక్ర శనివారాలు అట్లాగే ఉంచి ఆదివారంనాడు కపిలగిరి సోపానం సమీపాన ఈశాన్యంలో సమాధిచేసినారు. నాటినుండి ఏటేటా గురుసమారాధనలు వైభవోపేతంగా జరుగుతున్నాయి. యోగానందుల సమాధి ఆధివ్యాధి గ్రహ పీడితులందరికీ యాత్రాస్థలం; కామధేనువు కల్పవృక్షముల శక్తుల కూడలి.

పరమహంస యోగానంద నరసింహ మహర్షి తమశిష్యుడు గురుదత్త బ్రహ్మర్షి నారాయణస్వామికి 4-2-1948 నాడు చేసిన ప్రబోధం 'గురుశిష్య సంవాదం' లేదా 'పరమహంస ప్రదీపిక' అనే పేర్లు గల గొప్ప అధ్యాత్మగ్రంథం. ఇది శ్రీనారాయణస్వామి యోగివర్యుల చేతివ్రాతలో ఉన్నది. ఇందులో మొదట 'గురువంశావళి' జన్మచరిత్ర ఉంది. తరువాత ప్రధాన గ్రంథం నాలుగు భాగాలు.

ప్రథమభాగం ఆత్మరామాయణం. ఇది వాల్మీకి రామాయణానికి యోగపరమైన వివరణం. రాముడాత్మ, లక్ష్మణుడు జ్ఞానం, సీత ఆనందం, అయోధ్య హృదయం, దశరథుడు సత్యం, కౌసల్య ధర్మం, సుమిత్ర ఉపకారం, కైకదుర్గుణం, అరణ్యం పాపం, శూర్పణఖ మాయ, మారీచుడు మనస్సు, లక్ష్మణరేఖలు సప్తచక్రాలు, రావణుడుకామం. కుంభకర్ణుడు మోహం, విభీషణుడు శాంతం, సుగ్రీవుడు సుగుణం, ఆంజనేయుడు ధైర్యం, 33 కోట్లకపులు రోమకూపాలు, పర్ణశాలవారధి; సంకల్పం, సముద్రం సుఖదుఃఖాలు, లంకశరీరం, ఇంద్రజిత్తు ఇంద్రియాలు, అశోకవనం ఆగమసంచిత ప్రారబ్ధకర్మలు. రేచక పూరక కుంభక ప్రాణాయామ యోగసాధనమే ఆత్మరామాయణ సంగ్రహం.

ద్వితీయ భాగంలో సద్గురువు లక్షణాలు, జ్ఞానం, సత్యం, భక్తి, పరోపకారం వంటి అనేక విషయాల వివరణం ఉన్నది. శిష్యుని ప్రశ్నలు గురువుగారి సమాధానాల రూపంగా నడచిన గ్రంథమిది. చివరన యాలలని ఒక శీర్షిక; శిష్యుడడిగితే గురువు చెప్పటం ఏలపదాల రూపంలో సాగినరచన. యోగాలలో రాజయోగం, త్యాగాలలో మనస్సు త్యాగం, రాగాలలో విరాగం, ధర్మాలలో అహింస, విద్యలలో బ్రహ్మవిద్య, కాంతలలో ముక్తి కాంత, స్నేహంలో సత్సంగం, ద్రోహాలలో గురుద్రోహం గొప్పవని విశేషాలుట్టంకించినారు.

తృతీయభాగం మహాభారత సౌరభం. శ్రీమద్రామాయణానికి వలెనే భారతానికి అధ్యాత్మ యోగ పరమైన వివరణమిది. పంచపాండవులు పంచభూతాలు పంచవాయువులు, ద్రౌపదిముక్తికాంత, 12 ఏండ్ల అరణ్యావాసం ప్రణవపంచాక్షరితో కూడిన ద్వాదశాక్షరీమహామంత్రజపం, దశవిధనాదాలు ఇడపింగళ నాడుల్లో చరించటం.

చతుర్థభాగం గురుధ్యాన రూపతత్వాలు, స్తోత్ర రూపమైన మంగళారతులు. యోగానందుల ముఖ్యశిష్యులు అబ్బూరి చిదానందయ్య, రత్నదాసు, నారాయణదాసులు రచించిన కృతులివి.

ఈ పరమహంస ప్రదీపిక మహర్షి యోగా నందులకు అనుభవమైన బ్రహ్మర్షి నారాయణస్వామికి అనుభవంలోనికి తెప్పించిన యోగవిద్య.

ఆధారం:- శ్రీనారాయణస్వామివారి జీవితచరిత్రమరియు పరమహంస ప్రదీపిక రచయితలు: శ్రీగుండెపూడి వెంకటలక్ష్మి నరసింహమూర్తి 'అబ్బరాజు' శ్రీనివాసమూర్తి; ప్రచురణకర్త; పలకలూరి శివరావు - పాతగుంటూరు. 1985.

# దశోపనిషత్తులు

"ఈశ కేన కఠప్రశ్నముండ మాండూక్య తిత్తిరి
ఐతరేయంచ ఛాందోగ్యంబృహదారణ్యాకం దశ"

ముఖ్యమైన పది ఉపనిషత్తులను గుర్తుంచుకోవటానికి ఈశ్లోకంలో కూర్చారు. ఈశ్లోకంలో ఉన్నవరుసనే శ్రీశంకర భగవత్పాదులవారు వీటికి భాష్యాలు వ్రాశారు. ఈశ అంటే ఈశావాస్యోపనిషత్తు. ఈ ఉపనిషత్తు శుక్లయజుర్వేద సంహితలోనిది. 'ఈశా వాస్య మిదంసర్వం' అని ఈ ఉపనిషత్తు ప్రారంభం కావడం వల్ల దీనికి పేరు వచ్చింది. 'కేన' అని ప్రారంభమవుతుంది కేనోపనిషత్తు. కేనోపనిషత్తు సామ వేదంలోని జైమిని శాఖలో తలవకారబ్రాహ్మణంలో ఉన్నది కాబట్టి దీనిని తలవకారోపనిషత్తు అని కూడా వ్యవహరిస్తారు. కఠం అంటే కఠోపనిషత్తు. ఇది కృష్ణయజుర్వేదంలోనిది. నచికేతుడనే బ్రహ్మచారికి యముడు బోధిస్తాడు. శ్రీవివేకానంద స్వామి స్వీకరించిన 'ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్ని బోధత' అనే మంత్రం కఠోపనిషత్తులోనిదే. కఠోపనిషత్తులోని మంత్రాలు భగవద్గీతలో కనపడతాయి. కఠోపనిషత్తు తర్వాత ప్రశ్నోపనిషత్తు, ముండకోపనిషత్తు, మాండూక్యోపనిషత్తు ఈమూడున్నూ అధర్వవేదానికి సంబంధించినవి. ప్రాణం ఏవిధంగా శరీరంలో ప్రవేశిస్తున్నది, పరమాత్మకు జీవాత్మకు గల సంబంధ మేమిటి మొదలైన ప్రశ్నలకు సమాధానాలిస్తుంది కాబట్టి ఇది ప్రశ్నోపనిషత్తు అయింది. ముండకోపనిషత్తు అక్షర పరబ్రహ్మను గూర్చి వివరిస్తుంది. 'సత్యమేవజయతే' అనే వాక్యం ఈఉపనిషత్తులో నిదే. స్వాములు వార్లను పూర్ణకుంభంతో స్వాగతం చెప్పేటప్పుడు 'వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః' అని చెప్పేమంత్రం ఈ ఉపనిషత్తులోదే. 'యథానద్యః స్యందమానాస్సముద్రే' అనే శ్లోకం కూడా ఇందులోదే. తరువాత మాండక్యోపనిషత్తు. మాండూక్య మంటే కప్పకు సంబంధించింది. కప్ప ఇతిరజంతువులాగా అడుగులువేసి సంచారం చేయదు. మొదటి మెట్టు నుంచి నాలుగో మెట్టుకు ఒక్క గెంతులో దాటి పోతుంది. ఈ ఉపనిషత్తు జాగృతి, స్వప్నం, సుషుప్తి అనే మూడ వస్థలుదాటినాలుగో అవస్థ అయిన తురీయానికి చేరే మార్గం చెపుతుంది. ఈ ఉపనిషత్తుకు మాండుక్య రూపి అయిన వరుణ భగవానుడు ఋషి. ఉపనిషత్తులన్నిటిలోకీ ఇది చాలాచిన్నది. మొత్తం మంత్రాలు 12. మాండూక్యానికి తరవాతదితైత్తిరీయం. అన్నిటిలోకీ ఎక్కువగా దీనినే అధ్యయనం చేస్తారు. శిక్షావల్లి, ఆనంద వల్లి, భృగువల్లి అని దీనిలో మూడు భాగాలున్నాయి. తరువాత ఐతరేయోపనిషత్తు. ఇది ఋగ్వేదంలోది. జీవుడు ఎట్లా మాతృగర్భంలో పడిజన్మిస్తూ నిర్వేదంచెందుతూ సంసార విచ్ఛేదకరమైన జ్ఞానం మూలంగా ఆత్మోపలబ్ధిపొందుతాడో వివరిస్తుంది ఉపనిషత్తు. దీనికి వామదేవుడు ఋషి. ఇక ఈ పదిలో మిగిలినవి ఛాందోగ్యమూ బృహదారణ్యకమూ.

ఇవి రెండూ చాలా పెద్దవి. మిగతా అన్ని ఎనిమిది ఉపనిషత్తులు కలిపినా వాటి కంటే ఈ రెండు పెద్దవి. ఛాందోగ్యం సామవేదంలోది. 'ఛందోగ' అంటే సామగానం చేసే వాడు అని అర్థం. ఛందోగ అవస్థ జెండెవస్థాగామారింది. ఇది పారశీకులవేదం. భగవద్గీతలో కఠోపనిషత్తులోని మంత్రాలు ఎక్కువగా ఎట్లా కనపడతాయో, బ్రహ్మ సూత్రాలలో ఛాంద్యోగంలోని మంత్రాలు అట్లా ఎక్కువగా కనపడతాయి. ఛాంద్యోగం ఉద్గీథ ఉపాసనతోప్రారంభ మవుతుంది. ఉద్గీథం అంటే ప్రణవం. ఓంకారం. 'తత్త్వమసి' అనే మహావాక్యం ఇందులోదే.

బృహత్ అంటే పెద్దది అని అర్థం. అన్నిటి కన్నా పెద్దది కాబట్టి దీనిని బృహదారణ్యకమన్నారు. దీనిలో ఆరధ్యాయాలు మధుకాండం, మునికాండం, ఖిలకాండంగా ఇవి రూపొందాయి. 'అసతోమాసద్గమయ. తమసోమా జ్యోతిర్గమయ, మృత్యోర్మా అమృతంగమయ' అనే మంత్రం ఇందులోదే. అజాత శత్రువనే క్షత్రియుడి దగ్గర గార్గి అనే బ్రహ్మవాదిని పొందిన ఉపదేశమే ఈఉపనిషత్తు. యాజ్ఞవల్క్యుడుతన భార్య మైత్రేయికి చేసిన ప్రబోధమే ఈ ఉపనిషత్తు. తపస్సు యొక్క శ్రేష్ఠతను ఈ ఉపనిషత్తు విపులంగా వివరిస్తుంది.

*-- (శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వామి కృపా భాషణము - సంక్షిప్తీకరణము- అ.ర.)*

# విశ్వరూపం

-- డా. పోతుకూచి సాంబశివరావు

కిష్టయ్యా, కిష్టయ్యా
ఓచిన్ని కిష్టయ్యా
జగ మంతనీకెరుక
జగాన నీఆట.
గోపికలు ఎవరయ్యా
నీ భక్త మునులయ్యా
రామావతారాన
రమ్మని పిలిచావు ||కి||
గోవులు ఎవరయ్యా
నీ భక్త వానరులు
రామావతారాన
రమ్మంటె వచ్చారు ||కి||
అష్టభార్యలెవరయ్యా
అష్ట దిశలేనయ్యా
నేలమీద నీవుంటే
నింగితా మనీశిరము ||కి||

# విశ్వప్రకాశం పాఠకులకు శుభవార్త

సర్వార్ధ సంక్షేమ సమితి, హైదరాబాద్, ద్వారా కొత్త ఢిల్లీలోని ఆంధ్ర భవనంలో సెప్టెంబరు 14, 15, 16, 17 తేదీల్లో ఈక్రింది బృహత్ కార్యక్రమాలు జరుపతలపెట్టి మా యీ చిన్న సంస్థ ఒక అడుగు ముందుకు వేయుచున్నదని తెలియచేయుటకు సంత సించుచున్నాను.

14-9-95 ఉదయం, గణపతి, వాస్తుపూజ, శతరుద్రాభిషేకము రుద్ర చండీహవనం, లోక కళ్యాణర్ధం ఆంధ్ర ప్రదేశ ఋత్విక్కులచే జరుపబడును. సాయంత్రం అష్టావధానము, సంస్కృతంలో శ్రీ నాగఫణిశర్మ, పండిత బృందముచే.

15-9-95 ఆగమసదస్సు : దేశంనలు మూలలనుండి ఆగమశాస్త్ర వేత్తలు వేంచేసి, ఆలయములకు సంబంధించిన వివిధాంశములు చర్చించి పూజ నిత్య నైమిత్తికాది, నియమావళిని రూపొందింతురు.

16-9-95 Seminar on "Spritual values for universal integration and peace" భారత ఉపరాష్ట్రపతి గౌ. శ్రీ కె.ఆర్. నారాయణన్‌గారిచే ప్రారంభింపబడును. సాయంకాలం ఆధ్యాత్మికతత్త్వ వేత్తలచే ఉపన్యాసములు.

17-9-95 సాయంకాలం 5 గంటలకు, పై Seminar పై ఉపన్యాసములు. తీర్మానములు, 5.30 ని. ముగింపు సమావేశము, ముఖ్యాతి ముఖ్యులచే జరుపబడును. మరియు వివిధ రంగాల్లో నిష్ణాతులకు, సన్మాన కార్యక్రమము మరియు, సంగీత విభావరి రాత్రి 9 గంటలవరకు. పైకార్యక్రమా లెల్ల పుస్తకరూపంలో రాబోవుచున్నవి. వచ్చే సంచికలో పూర్తి వివరాలకై వేచియుండమనవి.

గమనిక : పైకార్యక్రమములెల్లయు, అపరదత్త
మూర్తులు, శ్రీశ్రీశ్రీ విశ్వయోగివిశ్వంజీ
(మా సంస్థగౌరవాధ్యక్షులు)
గారి దివ్య ఆశీస్సులతో, ఆదేశంతో వారి విశిష్ట సమక్షంలో జరుప నిశ్చయింపబడినవి. మరియు అనేక మఠాధిపతుల, పీఠాధిపతులచే ఆశీస్సులు పొందబడుచున్నవి.

మీ
P.V.Manohar Rao, *Chairman*
సర్వార్ధ సంక్షేమ సమితి




ఆలయములు వేరైనా ఆరాధకుడొక్కడే. మతాలు వేరైనా

మానవతే మానవుని ప్రథమ కర్తవ్యం.




BOOK POST Printed Matter

To

1067 Dr. B. Rama Raju
1-8-117/2
Chikkadpally
HYDRABAD.20

If undelivered please return to:
SARVARTHA SANKSHEMA SAMITHI
501, Pradeep Apartments, Gandhinagar, Hyd-38.

Edited, Printed & Published by Sri P.V. Manohara Rao, Sarvaardha Sankshema Samithi, Hyderabad-20.
Designed at *Advanced Graphic Systems*, Hyd-20,